శ్రీ సద్గురవే నమః

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక

మెరుకలక్షణంబను,

## (నాల్గవసంచిక.)

ఇది

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే,

రచియింపంబడి,

గుండా భూమయ్య గుప్త కార్యదర్శి గారిచె,

గుండా భూమన్న, యీశ్వరయ్య శ్రీహరిహర ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపంబడియె. సికింద్రాబాద్ ( దక్కన్. )

శ్రీ మద్గురవే నమః

వేద వేదాంతాతీత ద్వైతా ద్వైతరహిత పరమ తత్వమనందగు.

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వకందార్థానేకసద్దృష్టాంతప్రకాశిక.

మొదకలక్షణాంబను

(నాల్గవ సంచిక)

ఇది

శ్రీగోలకొండయనంబరగు దక్కన్ హైద్రాబాద రాజధానియందు

పెద్దమహారాజగంజు నివాసులైన,

## శ్రీమద్భాగవతకృష్ణదేశిక ప్రభువరులచే,

రచియింపంబడి

సహాయకార్యదర్శుల ప్రోత్సాహముచే

రాజవర్గమువారలయొక్కయు, పోషకులయొక్కయు, అభిమానుల

యొక్కయు, చందాదారులయొక్కయు, ద్రవ్య సహాయముచే

గారావర్జుల రామకృష్ణసచ్చిదానంద సద్గురుస్వామివారి ప్రియశిష్యుండగు

## గుండా భూమయ్య గుప్తకార్యదర్శిగారిచే

గుండా భూమన్న యీశ్వరయ్య

శ్రీహాహార ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడియె.

శికింద్రాబాద్ దక్కన్.

క్రోధననామ సం॥ పుష్య శు॥ ౧౫ మంగళవారము

ది॥ ౨౯ డిశంబరు ౧౯౨౫ సం॥

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

# ఇది తమ మిత్రులకు జూపుడు'

## ప్రకటన.

సద్గురుపుత్రులారా?                సత్పురుషులారా?

యీనాల్గవసంచిక నేటికి సంపూర్తియై వెలువడినది. తిరిగి ఐదవ సంచిక ప్రారంభమై సకాలమునకు వెల్లడించ ప్రయత్నించుచున్నారము గాన, రాజవర్గము వారలు, పోషకులు, అభిమానులు, చందాదారులు, త్వరలో చేరుటకు ప్రార్థితులు.

ఇట్లు। బుధజనవిధేయుడు,
గుండాభూమయ్యగుప్త కార్యదర్శి.

యిందువలన సకలజనులకు తెలియజేయడమేమనగా —

ఈగ్రంధము నః॥రా॥రా॥శ్రీ నైజాం గవర్నమెంటువారి శాసనమునుబట్టి రిజిష్టరు చేయబడియున్నది గనుక,

గీ॥ అదిగావున నితరులుయీ।
సదమలగ్రంధంబు నచ్చుసల్పగదగదా।
విధిమీరి యచ్చునిడిన।
వ్వదుతగునష్టంబటంచు భావింపుడికన్ ॥

ఈగ్రంథమును వలయువారు యీక్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఇట్లు

గుండాసంగయ్యగారి యీశ్వరయ్య కిరాణాం దుకాణాం.
మోండా బజారు శికిందాబాద్ దక్కన్.

సీ॥ శ్రీమన్మహాధాత్రి శ్రేష్ఠమై విలసిల్లు । వరముత్తిలగ్రామ వాసమైన
మెలిమి మందిప్పల కులసోముడగు నాగ । నాశమాంబకు మనోల్లాసమొదవ
హనుమంతరావు యంచవనీజనన మొంది । సకలవిద్యల నెల్ల సంగ్రహించి
పరమును పేక్షించి వర వేంకటేశ్వర । గురుజేరి పరిపూర్ణ గుహ్యమెరిగి
ధీర భూమానంద దీక్ష బొందిసుభక్త । మండలికి నిలచల మార్గమరయ
గరపి లేని మెరుక కలయని విడిపించు । హనుమయార్య సహజయచల గురుడు॥

శ్లో॥ ... భూమానంద ప్రకాశకం ।
[illegible] హనుమంతాఖ్యం గురుం భజే॥



శ్లో॥ శ్రీయమ నియమాద్యష్టాంగం । యోగానంద ప్రదాయకం ।
సంవిన్మయ హృదాకారం । రాజయోగీశ్వరం భజే॥

# శ్రీభూమానంద మందిప్పల హనుమంత రాజయోగి.

(*) అర్ధకందార్ధము. (*)

శ్రీకరమగు మందిప్పల * ప్రకటహనుమంతయోగి * పరిపూర్ణమునన్ *
చేకొని మెరుకను యెరిగియు * సాకల్యముగాను భ్రాంతి * చక్కగ విడచీ *
సంప్రదాయ సన్మార్గానడచీ * నిక్కముగా కందార్ధ నిర్ణయార్ధముగాను *
మక్కువతో శిష్యమండలికి బోధించి * ముక్కునను శ్రీ వేంకటేశ్వరఘనప్రభా
వము నెరిగి యొప్పెను * దిక్కనిశివరామదీక్షిత దివ్యపీఠాద్యక్షుడై భ్రమ *
చక్కగా విడచీ * సంప్రదాయ సన్మార్గనడచీ॥ * *

# విషయసూచిక.





శ్రీ గురుభ్యో నమః

శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత శక్తిద్వయనిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేకసదృష్టాంత ప్రకాశిక

—(*) మెరుకలక్షణం (*)—

* కందార్థము. *

(రగ) * మెరుకే దేహేంద్రియములు * మెరుకే వర్ణాశ్రమములు * మెరుకే శృతులుర్ * మెరుకేనీవునునేనును * మెరుకేసతిసోదరాదు * లెరుగుముపతా నేదీర్ఘేద నిదుగోనీయిచ్ఛా * హరిహరబ్రహ్మాది సురనరగిరిసరి * త్తరుమృగముఖ చరాచరములుమెరుకాని * మెరుగుముపతా * నేదీర్ఘేద * నిదుగోనీయిచ్ఛా॥

—(*) దత్తయోగీంద్రశతకము. (*)—

* స్థూలదేహలక్షణము *

సీ॥ మహితాస్థిరోమముల్ మాంసంబునాడీన । ఖాశిభూభూతాంశలైదునమరు।
రమణమేదోమూత్రరక్తశుక్లామేధ్య । మవిజలభూతాంశలైదునరయ ।
సక్షుత్తృష్ణాలస్యసంగమనిద్రలు । హవ్యభుగ్భూతాంశలైదునరయ ।
పురుషునికినిక్రోధభ్రమణోర్ధ్వతిర్యగూర్ధ్వస్థితుల్ మరుదంశతద్భవములు।
గీ॥ మరియు భయమోహక్రోధకామములు లోభ।మభ్రభూతాంశలైదుదేహమున వెలయు।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

* లింగదేహనిర్ణయము. *

సీ॥ శ్రోత్రంబుత్వక్చక్షునేత్రంబుజిహ్వయు । ఘ్రాణంబుతోహృషీకములునైదు
వాక్పాణిపాదగుహ్యపాయువులునైదు । కర్మేంద్రియంబులుకణకనివియు ।

ప్రాణముదానమపానసమానాది । వ్యానముల్ ప్రాణంబులైదునరయ ।
వరమనోబుద్ధులునడి రెంటితోగూడి । సరిసప్తదశకత్వసంఖ్యయయ్యె ।
గీ॥ సూక్ష్మదేహంబులింగాంగసూచితంబు । స్వప్నమిందుకుతైజసస్వామివీవు
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

దత్త 3

## * మహాకారణదేహము. *

సీ॥ వరుసనసద్యోజాతవామదేవాఘోర । తత్పురుషఈశానతతులుభూత ।
సుప్రకరమునివృత్తిప్రతిష్టావిద్య । శాంతిశాంత్యాతీతసమితివిషయు।
మేయింద్రియములుపంచాక్షరీయిచ్ఛా । క్రియాజ్ఞానమాదిపరాశక్తులగు ప్రాణ
ములును ।
బ్రహ్మచ్యుతులురుద్రులీశ్వరప్రముఖులు
గీ॥ గలిగియిరువదియైసంజ్ఞలబెరగి । లలిమహాకారణాంగంబువెలుగుచుండు।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

దత్త 4

## * అష్టతనువులు *

సీ॥ పాంచభౌతికమనభాసిల్లుస్థూలంబు । సూక్ష్మంబులింగాంగసూచితంబు।
బీజంబురెంటికిపేర్మికారణదేహ । మటతుర్యమానిర్మలాంగమనగ ।
ఆనందదేహంబునామీఁదవెలుగొందు । చిన్మయాంగములోనచెల్వమగుచు ।
అనువందచిద్రూపమనుదేహములరారు । శుద్ధలింగాంగంబుసారిదివెలయు ।
గీ॥ యిట్టితన్వష్టకపుసంజ్ఞలెరిగిబుధుఁడు । భావమునజూచునానందభరితుఁడగుచు ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

## * వేమనశతకము. (చతుర్విధ దేహములు) *

౪॥ గీ॥ స్థూలంబుకనుగుడ్డు సూక్ష్మంబుకనుపాప । కనుపాపలోనిది కారణంబు।
కారణంబుతుదను కడుబ్రహ్మమైయుండు । విశ్వదాభిరామవినర వేమా॥

దత్త 5

## * దేహచతుష్టయము *

సీ॥ జాగ్రతవిశ్వదశములు రాజసముక్రియాయుక్తభోగమేనధికతనువు।

కలతైజసుండిచ్ఛగుణతామసముప । ర్యుక్తభోగముసూక్ష్మమొప్పుచుండు ।
సుషుప్తిసాత్వికముప్రాజ్ఞుడజ్ఞానమునుహృదా । నందభోగముకారణంబునయ్యె ।
శుద్ధసత్త్వముశిరస్సునుప్రత్యగాత్మతు । ర్యముభోగమానందరహితమలరు ।
గీ॥ లలినుహాకారణముసాల్గులక్షణముల । నొప్పుదేహచతుష్టయంబుప్పతిలుచు ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

## * అష్టపురసాజ్ఞ *

సీ॥ జ్ఞానేంద్రియములైదుసమకూడియొకపురి । కర్మేంద్రియములైదుగలశియొకటి ।
కర్మసంచయమెల్లపేర్మితోనొకపురి । గుణమైనషడ్వర్గకూటమొకటి।
పంచభూతంబులుభావింపనొకపురి । దశవిధప్రాణసంతతియునొకటి ।
అంతరింద్రియవర్గమునువొందనొకపురి।యరయవిషయములొక్కపురియనదగు।
గీ॥ నిట్టియష్టపురంబులునెరిగివీటి । పరిహారముజేశిమిముగాంచుపరమయోగి ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

## * పంచీకరణము *

సీ॥ జ్ఞాతృత్వమునుసమానశ్రోత్రశబ్దవా । చ్యములైదుపుష్కరాంశములుతలప।
రహిమనోవ్యానచర్మస్పర్శప్రాణులు । నైదునుమరుదంశలైతనర్చు ।
నరయబుద్ధ్యుదాననేత్రరూపాంఘ్రులు । నైదుతేజోంశలైయటచెలంగు ।
చెలగిచిత్తాపానజిహ్వారసోపస్థ । లైదునుసలిలాంశలనగబరగు ।
గీ॥ గానహంకృతిప్రాణనాసికగంధగుదము ।లైదుభూమ్యంశలైయొప్పునఘచరిత ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార ।సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

## * పంచవింశతితత్త్వవృత్తులు *

సీ॥ రూఢిశబ్దస్పర్శరూపరసామోద । తతులివిపంచభూతములగల్గు ।
వినుటయంటుటకనుంగొనుటరుచిజ్ఞాన ।మెరుగమూర్కొనుటజ్ఞానేంద్రియములు
పలుకుటయిచ్చుటపైనమేగుటసుఖం । బెరుగుటవిడుకర్మేంద్రియములు ।
బలితజీర్ణించుటభంక్షిచుటవయువ । వ్యాప్తిసుస్థిరముప్రాణేంద్రియములు ।

గీ॥ నేననుటనిశ్చయించుటనిల్చియిష్ట । గనుటతలచుటయువినాల్గుకరణములును ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్య॥

* పంచశక్తిస్వరూపము. *

సీ॥ కనుపట్టువాగాదికర్మేంద్రియక్రియల్ । అరయక్రియాశక్తియనగబరగు ।
శబ్దాదివిషయపంచకమునగలక్రియల్ । పేర్మినిచ్ఛాశక్తిపేరునడరు ।
జ్ఞానేంద్రియంబులనూనినసత్క్రియల్ । జ్ఞానశక్తియనంగసరవిదనరు ।
ప్రాణపంచకమునపరిణమించినక్రియల్ । ఆదిశక్తియనంగనలరుచుండు ।
గీ॥ ఘనమనోచిత్తబుద్ధ్యహంకారక్రియల । జనుపరాశక్తియనపంచశక్తులివియు ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్య॥

* తాపత్రయలక్షణము *

సీ॥ శ్రోత్రజిహ్వాఘ్రాణనేత్రచర్మంబులు । పాణిపాదగుహ్యపాయు[illegible]లును ।
అలమనోబుద్ధిచిత్తాహంకృతులును । నధ్యాత్మలునధిభూతమునగవిను[illegible] ।
వినుటయంటుటగనుంగొనుటనానుటయూనుకొనుటపల్కుటమిచ్ఛటనుగమించు
టనుసుఖించుటవిసర్జనముగావించుట । తలపునిశ్చలచింతదగనహమూలు ।
గీ॥ దిక్సమీరార్కవరుణాశ్వదేవశిఖియు । పేంద్రమృత్యుప్రజాపతిచంద్రవిష్ణు ।
కమలభవరుద్రులధిదైవతములునరయ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్య॥

* సాంఖ్యము *

సీ॥ కర్మేంద్రియంబులుగానుశబ్దస్పర్శ । రూపరసామోదరుచులుగాను ।
జ్ఞానేంద్రియంబులవరుసలేమియుగాను । ప్రాణాదిదశవాయుపంక్తిగాను ।
అలమనోబుద్ధిచిత్తాహంకృతులుగాను । పురుషుడైనట్టిజీవుడనుగాను ।
క్షేత్రజ్ఞుడనుగానుచింతించనిన్నియు । యెరిగెటియెరుకనేనరశిచూడ ।
గీ॥ ననుచునాత్మానుభవమొందుమనదియెసాంఖ్య । యోగమనిచెప్పుచురు శివయోగివరులు
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్య॥

* అష్టాత్మలు *

సీ॥ పరికింపజీవాత్మప్రథమాహ్వయంబగు । నటమీదనంతరాత్మనగజెల్లు ।
ఆమీదపరమాత్మయైవెలుంగుచునుండు । నదిదాటనిర్మలాత్మనగవెలయు ।
సారిదినాలోజూడశుద్ధాత్మయైయొప్పు । జ్ఞానాత్మయాలోననాలవెలయు ।

మహిమతో నాలోన మహాదాత్మయలరారు । భూతాత్మసకలానుభూతిదనరు ।
ఘనత వెలుగొందు యష్టాత్మకంబులిట్లు ।
చిరశుభాకార మోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్త యోగీంద్రవర్యా॥

* దశ నాడులు. * దత్త-13

సీ॥ అలరుయిడాపింగళాహ్వాయములు రెండు । నాసికాద్వారముల్ నాడియుగము।
చెలగిపూషాపయస్విను లు రెండునుగూడ । ఈక్షణద్వయనాడు లెంచిచూడ।
అరయంగ గాంధారిహస్తిజిహ్వాలనంగ । కర్ణద్వయద్వారగతులు దెలియు।
ఆలంబువక్త్రంబు నటశంఖిణీనాడి । గుహ్యంబుగుదనాడి కుహువనంగ ।
గీ॥ బ్రహ్మనాడిసుషుమ్నయై పరగుచుండు । యిట్టిదశనాడిభేదము లెరుగుబుధుడు ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

* అష్టప్రకృతులు*షోడశవికారాలు *. దత్త-14

సీ॥ జ్ఞానేంద్రియాము లైదుకర్మేంద్రియము లైదు।వివరింప ప్రాణవాయువులునైదు।
చిత్తంబుతో గూడ చెలువొందపదహారు । రమణషోడశవికారములనంగ ।
బరగుపృథివ్యాదిపంచభూతంబులు । హృదయంబుబుద్ధ్యహంకృతులుగూడి।
యొనిమిదిక్రమముతో యేపార అష్ట । ప్రకృతులనబరగువిశ్రుతముగాను ।
గీ॥ యిన్నిటికినివె కారణం బెంచి చూడ । పరమమయ్యెంన్నయానందపరుడవగుచు ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార। సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

* పంచవింశతి తత్వనిర్ణయము * దత్త-15

సీ॥ పాణివాక్పదగుహ్యపాయువుల్ కర్మేంద్రి । యములుపృథివ్యాంశలరశిచూడ ।
రూఢిశబ్దస్పర్శరూపరసామోద । తన్మాత్రలునుజలతద్భవములు।
శ్రోత్రజిహ్వఘ్రాణనేత్రచర్మంబులు । జ్ఞానేంద్రియములగ్నిసంభవములు ।
ప్రాణమపానముదానసమానముల్ । వ్యానంబు ప్రాణముల్ వాయుజములు ।
గీ॥ మానసముబుద్ధ్యహంకృతిజ్ఞానచిత్త । ములునుకరణంబులాకాశమునజనించె।

చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

పత్ర-16

* భూ త సృ ష్టి *

సీ॥ ఆదినవ్యక్తంబునందుమహత్తత్వ । మునయించె దాని నుంచుదితమమ్యె ।
నాయహంకారంబునదిగుణత్రయమున । మూడువిధంబులై మొనసియుండు ।
సాత్వికాహంకారసరణిమనంబును । జ్ఞానేంద్రియంబులు సంభవించె ।
తైజసాహంకారతత్వంబునను ప్రాణ । ములునుకర్మేంద్రియంబులుజనించె ।
గీ॥ తామసాహంకృతికిశబ్దతతులతోడ । భూతములునయ్యెపిండముల్ పొలుపుమిగిలి ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

పత్ర-17

* *శ రీ ర ని ర్ణ య ము.*

సీ॥ అంగంబుతోంబదారంగుళంబులమట్టు । గలుగుప్రాదేశాష్టకంబు చాల ।
యెముకలు డెబ్బదియెనిమిదిగుండెలు । మరినూటతొమ్మిదిమర్మములును ।
తొంబదిరెండుసంధులు ముప్పిమట్రింశ । కంబులు హూంసనుల్లలిగియుండు ।
శతమూత్రకముకఫజలజిహ్వాముప్పావు । హృదయంబుపిత్తంబు మెదడుగూడ ।
గీ॥ అరయనొక్కొక్క సంధిత్రయంబుగూడ । అమరతతిసమకోట్లరోమావళియును
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

పత్ర-18

* ఆ స క్తి భ్రాం తి *

సీ॥ తలిదండ్రులాలుబిడ్డలునన్నదమ్ములు । బాంధవుల్ దగులుగాపసుచయంబు ।
ధనధాన్యములువస్త్రతతులుభూషణములు।రత్నముల్ కోశముల్ రాజ్యములును
క్షేత్రగృహారామశిమశ్రీగిరిదుర్గ । వనతటాకగ్రామవైభవములు ।
చతురంగబలములుసౌధముల్ కోటలు। గణుతికెక్కు గృహోపకరణములును ।
గీ॥ యున్నియునునిత్యములుగావుయెంచిచూడ । భక్తిముక్తిగొల్వమోక్ష సంప్రాప్తదగును ।
చిరశుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్యదత్తయోగీంద్రవర్యా॥

## ( భద్రాద్రి రామ శతకము. )

### * నర ప్రమాణము *

సీ॥ నరునకుతొంభైయాఱంగుళాలెనిమిది । జానలపొడవునాల్గానలెడ్పు ।
యిట్లుమున్నైమూడుకోట్లరోమంబులు । వెలయడెబ్బదిరెండు వేలనాళ్లు ।
యెముకలరువైయూరుయమఱితొంబైరెండు । కీళ్లుమున్నైమూడుమూళ్ల పేగు ।
శేరుగుండెలునర్ధశేరునురుధిరంబు । మఱుగునాలుగుశేర్లుమాంసముండు ।
గీ॥ సోలపైత్యంబుశ్లేష్మమసోలెడుండు । నీప్రకారంబుదేహంబులెన్నిచూడ ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహదాససంరక్షితాంహ్వ॥

### * భావార్థము. *

౮ * ౯౬ అంగుళములు నరప్రమాణము, ౮ జానలు పొడవు, ౪ జానలు వెడల్పు 33 కోట్లరోమములు, ౭౨ వేల నరములు ౬౬ యెముకలు ౯౨ కీళ్లు 33మూళ్ల పెద్ద పేగు, ౧ శేరు గుండె, ½ శేరు నెత్తురు, ౧ మఱువు ౪ శేరులు మాంసము, ౧సోలెడు పైత్యము అరసోలెడు శ్లేష్మము, విచారింపగా సకలదేహము లీప్రకారముగా నుండును.

### * శరీరత్రయ లక్షణము *

సీ॥ జ్ఞానేంద్రియంబులుకర్మేంద్రియములంత । రింద్రియంబులువిషయేంద్రియములు ।
ప్రాణాదులునుగూడిపరగనిర్వైయైదు । తత్వంబులనుస్థూలతనువునయ్యె ।
బాహ్యేంద్రియంబులుపదిప్రాణములునైదు । ధీమనంబులుసూక్ష్మదేహమయ్యె
యీశరీరద్వయహేతుకానాద్యవి । ద్యావృతమైకారణాంగమయ్యె ।
గీ॥ మూడుదేహంబులకునాదిమూలమైన । తురునకతురునకువిలక్షణుడవీవె ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహదాస సంరక్షితాంహ్వ॥

### * భావార్థము. *

౧౯ * జ్ఞానేంద్రియములు ౫, కర్మేంద్రియములు ౫ అంతరేంద్రియములు ౫, విషయేంద్రియములు ౫, ప్రాణేంద్రియములు ౫, యీ ౨౫ తత్వములుగూడి స్థూ

లశరీరమాయెను.

జ్ఞానేంద్రియములు ౫, కర్మేంద్రియములు ౫, ప్రాణేంద్రియములు ౫, మనో బుద్ధులు ౨ యీ ౧౭ తత్వములుగూడి సూక్ష్మ శరీరమాయెను.

ఈరెండుశరీరములకు మూలమై, అనాద్యవిద్యా వృతమై, కారణశరీరమాయెను; ఈమూడుశరీరములకు విలక్షణమైనది ఆత్మయని యెరుగవలెను.

## చతుర్దశేంద్రియ విషయములు.

సీ॥ శబ్దంబుచెవులకుస్పర్శచర్మంబున । కక్షికిరూపుజిహ్వకురసంబు ।
ముక్కుకుగంధంబువాక్కుకువచనంబు । కరముకుదానంబుచరణములకు ।
గమనంబుగుదముకుగలిగివిసర్జన । గుహ్యముకానందగుణముగల్గు ।
మనసుచలించునుమతినిశ్చయించును । చిత్తంబుచింతించుమొత్తముగను ।
గీ॥ మరియుహంకారమున నభిమానపడును । నివ్వి యెరిగిన తెలివిది యెరుగవలయు ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహ్వదాస సంరక్షితాంహ్వ॥

## * భావార్థము. *

౨౦ * చెవులకు శబ్దము, చర్మమునకు స్పర్శ, నేత్రమునకు రూపము, జిహ్వకు రసము, ముక్కుకు గంధము, వాక్కుకు వచనము, కరమునకు దానము, పాదమునకు గమనము, గుహ్యమునకు ఆనందము, గుదమునకు విసర్జన, మనస్సుకు కల్పన, బుద్ధికి నిశ్చయము, చిత్తమునకు చింతన, అహంకారమునకు అభిమానము, యివ్విటిని యెరిగినదే యెరుకసుమా.

## * చతుర్దశేంద్రియాధి దేవతలు *

సీ॥ శ్రవణంబులకునుదిక్చర్మంబునకు వాయు । చక్షువులకుజగచ్చక్షువరుణు ।
డునుజిహ్వకునుఘ్రాణమునకశ్వినీసురల్ । వాగింద్రియమునకువహ్నిహస్త ।
ములకుయింద్రుడుపాదములకునుపేంద్రుండు।గుదముకుమృత్యువుగుహ్యమునకు।
చతురాననుడుమానసమునకుచంద్రుండు । బుద్ధికిపరమేష్టిశుద్ధచిత్త ।
గీ॥ మునకుజీవుండుహంకారమునకుశివుడు । తెలియవలెనీచతుర్దశదేవతలను ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహ్వదాససంరక్షితాంహ్వ॥

* భావార్థము. *

౨౧ * చెవులకు దిక్కులు, చర్మమునకు వాయువు, నేత్రమునకుసూర్యుడు, జిహ్వకు వరుణుడు. ముక్కునకు అశ్వినులు, వాక్కునకు అగ్ని, పాణికి ఇంద్రుడు, పాదములకు ఉపేంద్రుడు, గుహ్యమునకు బ్రహ్మ, గుదమునకు మృత్యువు, మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి. చిత్తమునకు జీవుండు, అహంకారమునకు శివుడు.

* పంచీకరణలక్షణము. *

సీ॥ ఆకాశపంచకమంతరింద్రియములు । ప్రాణాదులునువాయుపంచకంబు ।
జ్ఞానేంద్రియములువైశ్వానరపంచక । మప్పుపంచకమును శబ్దాదులైదు ।
కర్మేంద్రియములైదుకనుభూమిపంచకం । బిట్టులిరువదైదింద్రియములు ।
యివియాత్మగాదనియిన్నింటినెరిగెడు । యెరుకయేపరమాత్మయనియెరింగి ।
గీ॥ సాంఖ్యయోగంబుసాధించిసజ్జనుండు । ముక్తిజెందునుమీపాదభక్తితోను ।
భవ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరశింహ్వదాససంరక్షితాంహ్వ॥

* భావార్థము. *

౧౨ * ఆకాశపంచకము, జ్ఞానము, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము. ఇవి అంతరేంద్రియములు. వాయుపంచకము, సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము అపానము. ఇవి ప్రాణేంద్రియములు. అగ్నిపంచకము శ్రోత్రము త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణము ఇవి జ్ఞానేంద్రియములు. ఇ జలపంచకము శబ్దము స్పర్శ రూపము రసము గంధము ఇవి విషయేంద్రియములు పృథివి పంచకము వాక్కు పాణి పాదము గుదము గుహ్యము ఇవి కర్మేంద్రియములు. యిన్నిటినిమెరిగిన యెరుకయే పరమాత్మయని తెలిసికొనుటయే సాంఖ్యము.

* పిండాండమందు పంచభూతములు. *

సీ॥ జ్ఞానసమానముల్ వీనులుశబ్దంబు । వాగ్వ్యోమయంశముల్ వరుసనారామ ।
మనసువ్యానముచర్మమునుస్పర్శకరములు । వాయుయంశంబులువరుసనారామ ।
తూఘిబుద్ధియుదానరూపాక్షిపాదముల్ । వహ్నియంశంబులువరుసనారామ ।

చిత్తంబుప్రాణంబుజిహ్వాశిశ్నరసంబు । వారియంశంబులువరుసనాయె ।
గీ॥ గంధహంకారములపానఘ్రాణగుదము । లాయెభూయంశలిట్లునీమాయవలన ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరశింహ్వదాససంరక్షితాంహ్వ॥

* భావార్థము. *

౧౩ * జ్ఞానము సమానము శ్రోత్రము శబ్దము వాక్కు గీ ఆకాశాంశములు. మనస్సు వ్యానము త్వక్కు స్పర్శ పాణి గీ వాయువంశములు. బుద్ధి ఉదానము చక్షు రూపము పాదము గీఅగ్నిఅంశములు. చిత్తము ప్రాణము జిహ్వ రసము శిశ్న ము గీ జలాంశములు. అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము గీ పృ థివిఅంశములు.

* పంచభూతాంశగుణాలు. *

సీ॥ నరములస్థులుచర్మ నఖరోమ మాంసముల్ ।భూగుణంబులు స్వేదమూత్రశ్లేష్మ
ములుశుక్లశోణితంబులుజలగుణములు । క్షుత్పిపాసాలస్యసుప్తిసంగ ।
ములువహ్నిగుణములుచలనధావనకంప । నాకుంచనప్రసర ణాదికములు ।
పవనాదిగుణములుభయకామమోహముల్ । క్రోధలజ్జలునభోగుణములిట్టి ।
గీ॥ పంచభూతాంశగుణముల బారదోలి । నీస్వరూపంబుగనువాడునిర్మలుండు ।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహ్వదాస సంరక్షితాంహ్వ॥

* భావార్థము. *

౧౪ * ఎముకలు చర్మము గోళ్లు వెంట్రుకలు మాంసము. గీ భూగుణములు చెమట మూత్రము రక్తము శుక్లము శోణితము గీ జలగుణములు. ఆకలి దప్పి ఆల స్యము నిద్ర సంగము గీ అగ్నిగుణములు. పరుగుట తిరుగుట ముడుచుట చాచుట దాటుట గీ వాయుగుణములు. కామము క్రోధము లోభము మోహము భయము గీ అగ్నిగుణములు

* దశనాడుల నిర్ణయము. *

సీ॥ గాంధారిహస్తినిఘననాళములురెండు । నేత్రద్వయంబులనిలచియుండు ।

సమరిపూషాలంబనాళంబులును రెండు। కర్ణద్వయంబునగలిగియుండు।
వరజిహ్వనాడియువక్త్రంబునందుండు। నాభినిశంఖినీనాళముండు।
కుహూలశినీవాలిగూడిరత్నాహ్వయు। గుదగుహ్యములయందుకుదిరియుండు।
గీ॥ కంఠమందుపయస్విని గలిగియుండు। క్షుధయుతృష్ణయు నెరిగింపుచుండు నెప్పుడు।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు। రామనరశింహ్వదాససంరక్షితాంహ్వ॥

* భా వా ర్థ ము *

౨౯ * గాంధారి, హస్తినులు నేత్రములందుండును. పూషా అలంబ శ్రోత్రములం దుండును. జిహ్వ వక్త్రమందుండును. శంఖిని నాభియం[illegible] కుహు, శినీవాలి, రత్నాహ్వయ, గుద గుహ్యములందుండును. పయస్విని కంఠమందుం[illegible] క్షుధ తృష్ణల నెరిగించును

* సు షు మ్న నా డీ ల క్ష ణ ము. *

సీ॥ యిడయుపింగళయునుకుడియెడమలనుండు। నడుమసూక్ష్మసుషుమ్ననాడియుండు
యానాడిరంధ్రమధ్యమునందుసూర్యసో। మాగ్నివిద్యాక్షరమాయయాత్మ।
సప్తసముద్రముల్ సప్తపర్వతములు। చతురువేదంబులు శాస్త్రములును।
పంచభూతములు సప్తద్వీపములులోక। ములుగుణంబులుమంత్రములునుకళలు
గీ॥ బిందునాదముదిగ్వాయుబీజమాది। సకలదృశ్యపదార్థముల్ సమతనుండు।
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు। రామనరశింహ్వదాససంరక్షితాంహ్వ॥

* భా వా ర్థ ము *

౩౦ * కుడిముక్కు ఇడ, ఎడమముక్కు పింగళ, ఈ రెంటికి నడుమ సుషుమ్ననాడి యుండును. దాని అగ్రరంధ్రమందు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, విద్యా, అక్షరము మాయ, ఆత్మ సప్తసముద్రములు, సప్తపర్వతములు, చతుర్వేదములు శాస్త్రములు పంచభూతములు, సప్తద్వీపములు, లోకములు, గుణములు, మంత్రములు, కళలు, బిందువు నాదము, దిక్కులు, వాయువులు, బీజములు, ఈ మొదలైన, సకల దృశ్య పదార్థము లుగూడి యుండును.

—(*) శ్రీ శివరామదీక్షితీయ మనుబృహద్వాసిష్ఠం (*)—

* అచలబోధసిద్ధాంతం *

# చలలక్షణము.

వాయువు వంటిది.

మూలంలేని యీగు తెఱిగే శరీరం మనురామాత్ర ప్రమాణం। యిదే ప్రకృతి పురుషులు గొప్ప కొంచం యిదే।యిదే మూలమాయ। వున్నంత సేపూ బట్టబయలులోనే విహరిస్తుంది। బట్టబయలునువిడిచి వుండేటందుకు దీనికి వేరే స్థలంలేదు। యిదినిరుపాధికంగాయుండదు। బట్టబయలువలన పుట్టదు। శరీరం వలనపుట్టింది।దీనివలన శరీరంపుట్టింది।యిది బట్టబయలులో వున్నంత సేపూ దీనికి అనేక సామర్థ్యాలు కలిగివుండును। నీళ్లల్లో మొసలివలె।యిదే సమస్తమైన త్రిపుటులూ। యీ అహంస్ఫురణే। నేననే మూలమాయ। యిదేసమస్తమైన ద్వంద్వాలు। యిదేధ్వనిరూపం।యిదే అర్ధమాత్ర। యిదే కృష్ణపింగళ రూపం। యిదేపిండబ్రహ్మాండస్వరూపిణి। దీనిపేరేమెరుకా। దీనికే మెరుకా మనుపులు గలవు। దీన్ని రమ్మనేవారు లేరు।వుండమనేవారులేరు।పొమ్మనేవారులేరు।యిది సముద్రములోచాపవున్నట్టు వున్నది।తనకుదానువస్తుంది।తనకుదానువుంచుంది సకలవ్యవహారాలుచేస్తుంది।తనకుదానేయేమీలేకపోతుంది।నిత్యంఅనేకమార్లు వస్తుంది వెంటనే యేమీలేదు।తనమూలం తానే యెరుగదు। సకలభ్రమలకు మూలం యిదే।యిదికలలోవచ్చిన శరీరంవంటిది।యిదే మహాకారణ శరీరమనదగినది।తనతోకూడాసమస్తానికీ నామ రూప కుల గోత్రాదులను యేర్పాట్లుచేసింది యిదే। వేదశాస్త్రాది విద్యలనుకల్పించిందియిదే।దీనిది అవాంతరవారతనము।యిది సమస్తభాషారూపిణి। యిది రానమునుపు నిశ్శబ్దమే। యిదే ప్రత్యక్చైతన్యం। యిదేపరమచైతన్యం। యిదేఉభయ ఐక్యం। యిదే"తత్వమసిరూపం"। యిదే"బ్రహ్మాహమస్మి"। యిదే" ప్రజ్ఞానంబ్రహ్మ"। యిదే" అయమాత్మాబ్రహ్మ" యిదేబట్టబయలునుబైటపెట్టింది। దీనినుంచేఆకాశాది పంచభూతాలు పుట్టినవి పంచకారణస్వరూపం। తానువాక్కే అయివుండి తనలోతానే అనేకముగా భ్రమిస్తుంది। తనతోటిజీవేశ్వరులు। తాను లేకుంటే జీవేశ్వరులు లేరు। యిదేస్మ

! దీనికే స్మరణ । దీనికే విస్మరణ । నిబద్ధిపుస్తకం యిదే చేశింది । అబద్ధాల పుస్తకం యిదే చేశింది। గురుశిష్యబోధా స్వరూపంయిదే । నిశ్చయాలుచేశేది యిదే। నిశ్చయానికిదారికేది యిదే । దీనికిప్రమాణాప్రమాణాలు రెండుకద్దు। దీనికి వుంటే వుండేది లేకుంటే యేమీలేదు । యిటువంటి రెండుతిప్పలుకద్దు । ఆసుకోయ్యవలె తిరుగుచుంది । క్షణమైనా వూరికెవుండదు । యేదైనా వొక వ్యవహారం చేస్తూనే వుంచుంది । యేకంయిదే ।అనేకంయిదే । సూక్ష్మమాయ అహంస్ఫురణ । స్థూలమాయ మనోబుధ్యహంకార పంచ భూతాలు । స్థూల సూక్ష్మమాయలు రెండూయిదే। విక్షేపశక్తి సూక్ష్మ దేహం । ఆవరణ శక్తి స్థూలదేహం । నేనుఅనేవిక్షేపమే ఆవరణానికిమూలం । అనేక ఆవరణాలు కల్పిస్తుంది । యీవిక్షేపావరణ శక్తులు రెండూ నేననే యిదే । అజడం విక్షేపశక్తి జడం ఆవరణశక్తి జడాజడాలురెండూయిదే। క్షేత్రం ఆవరణశక్తి క్షేత్రజ్ఞుడు విక్షేపశక్తి । విక్షేపంపోతే ఆవరణంపాయ । ఆవరణంతోటి విక్షేపం పోదు । క్షేత్ర క్షేత్రజ్ఞులు రెండూయిదే । జ్ఞానాజ్ఞానాలే క్షేత్రక్షేత్రజ్ఞులు । దీనిరాకడే ప్రపంచోత్పత్తి। దీనిపోకడే ప్రపంచ ప్రళయం । సుషుప్తిని మరణాన్ని యెరుగనిదియిదే । యిదేనడమంత్రపుది । పుట్టనిచావని అచలానకూ తనకూ సంబంధంలేనిదే సంబంధంవున్నది అనేది యిదే। యిదే సకల అబద్ధాలు అడేది యిదే చలం । యీ చంచలస్వభావంగలది యేమిచెప్పినాచెలించిపొయ్యేవే । యిది చెప్పినమాటలు దీనితోటేపోఛావి। యిది చెప్పేమాట దీనివంటివారే నమ్మచారు । యిదే మధ్యవచ్చి మధ్య పొయ్యేది । దేహమును విడిస్తె దేహికి వుండేస్థలంలేదు । దేహిలేకుంటేదేహమును యెరిగేవారు లేరు । వచ్చేటప్పుడు దేహిలేని దేహంరాలేదు । రాంగనే దేహి దేహాలువొక్కటే । యీ రెంటిని వేరనకూడదు । యిదే సకలవినోదాలుచేసి యేమీలేకపొయ్యేది। దీనికి అచలానికి యేమాత్రం సంబంధంలేదు । తానుమూలంలేనిది । అన్నిటికితానేమూలంఅయింది । పుట్టిచచ్చేదియిదే । రాకడా పోకడలు గలదియిదే । దీనికి అచలంవున్నది యెరుకలేదు । అచలంవున్నది యెప్పుడు తెలిస్తే అప్పుడే తానువుండదు । చలమేస్థిరమనినమ్మకునేదియిదే । శరీరంఅబద్ధం నేనునిబద్ధి అనేదియిదే। నేనూ శరీరం వొక్కటే అనేదియిదే। నేను వేరే యీశ్వరుడు వేరే అనేది యిదే। వివేకా

వివేకాలను నిబంధన చేశేది యిదే! యిది నిబద్ధి అది అబద్ధం అనేదియిదే। నేను నేనే అనేది యిదే। నీవూనేనే అనేది యిదే। దేవుడునేనే అనేదియిదే। కన్నులయందువున్న పాప రూపమైన యెరుక యిదే। తనకు కారణంవున్నది అని భాష్యాలు చేశింది యిదే। యీ భ్రాంతి సార్వకాలం వుండేదికాదు। అయితే పోకనేపోవు। దీనివంటి శిష్టులేదు। దీనివంటి భ్రష్టులేదు। దీనికి నేదైనావొక రోగం। దరిద్రం। సంపత్తి। వున్నప్పుడు వొక్కతీరుగా వుండదు।కుణేకు యేమీలేదు।సకలమాయలు చేశింది యిదే।దీనిరాకడా పోకడా యెవ్వరూ యెరుగరూ। తానువున్నంతశేపే యెరుక అయినా మరుపు అయినా। తాను లేకుంటే యేమీలేదు। దీని రావుటమే స్వప్నం। గురునిచాత యిది యేమీలేదని తెలిశి దృష్టమై దృష్టంతోగూడా యిదిలేకపోవుటమే మేల్కు।యిది లేనప్పుడు సుషుప్తి అని మందిఅన్నారు।మరణమని మందిఅన్నారు। దీనికి తనకుతానువచ్చేదికద్దు తల్లికడుపులోవుండి వెళ్లివచ్చేదికద్దు। యిదియిన్నాళ్లువుంచుందనే మర్యాదా లేనిది। సకలక్రియలకూ మూలంయిదే। అధిష్ఠానంలేనిది యిదే। దీనికి మూలంవున్నదని చెప్పంగనే వాడు పుట్టనేపుట్టే। పుట్టినవాడు చావనేచస్తాడు। దీని బ్రతుకు కేవలభ్రాంతిమాత్రమె। యిదిపోయినవెనక దీనివ్యవహారం వున్నదని లేదని యెవ్వరుఅన। యేమీలేదని యెవ్వరుఅన। యీగుతెఱిగే శరీరమనే చంచలంచాత।శరీరంయేమీలేదని। స్మారకంవచ్చినా। సార్వకాలం అచేతమే। శరీరంవలన పుట్టినవేలన్ని। తనమతం తనకే సమ్మతంగాని యేమతం నమ్మనిది యిదే। షణ్మతాలనూ కల్పించిందియిదే। భూమండలమందు శరీరం లేనివారు వున్నారంటే నమ్మనిది యిదే। సకలనిశ్చయాలు దీనికే। సకలసంశయాలు దీనికే। తాను వచ్చేటప్పుడు। యేనుగలు। గుర్రాలు। లొటిపిటలు। కుక్కలు।గాడ్దులు। పందులు। పిల్లులు। యెలుకలు। పెద్దపులులు। సింహాలు।అనేకమంది గుర్రాలత్తోమేవాండ్లు। ఆడివాండ్లు। బూడిదెగాండ్లు। నామదార్లు। అద్దకపు బట్టవలె నిలువునిండా ముద్రలు పొడుచుకున్నవాండ్లు। బోడవాండ్లు। ఫక్కీర్లు। గొడ్డలివలె పెట్టుకున్నవాండ్లు। పెద్దపెద్ద పట్టెనామాల వాండ్లు। ఆవులు। బఱ్ఱె। గొఱ్ఱె। మేకలు। నూలలు। మాద్గులు। మొదలైనవాండ్లు అనేకులు।తన వలెనే మూలంలేక యెక్కడినుంచోవచ్చి సకలమైన వ్యవహారాలు చేస్తూ

పెండ్లాము పిల్లలు మనములు గలవారివలె । వున్నట్టు తోచబడేవిదీనికే। అయోని సంభవులు యోనిసంభవులుయిదే। తలకాయ అనే మొదలు। కాళ్లుఅనే కొనా గలది యిదే। శూన్యమై పొయ్యేదియిదే। శూన్యమంటే యేమీ లేదు। జ్ఞానా జ్ఞానాలు యిదే। యిది శరీరంలేనిదానిలోనే వుండేది। నిలువ నీడలేనిదియిదే। సకల ప్రయత్నాలు చేశేదియిదే! తల్లీ తాడీ లేనిదియిదే। వుండేది లేకపొ య్యేది యిదే! తనకు మొదలు లేదని యెరిగేదియిదే। కొనకు వుండేటందుకు యేమీ లేదని యెరిగేదియిదే। యిదివచ్చినప్పుడు నీవుయెక్కడనుంచి వచ్చినావు యెక్కడికి పొచావు అని అడిగేదిక్కు లేనిది యిదే। వచ్చినప్పటినుంచి సుఖమై నా దుఃఖమైనా అనుభవించి పొయ్యేదియిదే। భ్రాంతినివర్తి కావలెనని కోరేది యిదే। భ్రాంతినివర్తి కావలశింది దీనికే। అధిక నీచాలుయిదే। యిచ్ఛారూపం యిదే। యేనుగ అధికం। యెలుక నీచం। సింహ్వం యెక్కువ। యేనుగ తక్కువ। పిల్లి యెక్కువ। యెలుక తక్కువ। కనక। మూలంలేని యీగు తెరిగే శరీరాలే। అందులో కుక్కకు బ్రహ్మజ్ఞాని అనేవాడికే। కోడికి కాలజ్ఞాని అనేవాడికే। చీమకు దివ్యజ్ఞాని అనేవాడికే। యిట్లా గుతెరి గినది వొక్కటీ నిలువదు। మెరుపువలె వున్నాననిపించి వెంటనే యేమీ లేకపొయ్యేది యిదే। దురహంకార। నిరహంకార। శుద్ధాహంరములు యిదే। యిది బదులులేనిది। దీనివల్లనే సచ్చిదానందం పుట్టింది। యిది సచ్చిదానందం వల్లనే పుట్టింది। సచ్చిదానందమే అనాత్మ। సచ్చితానందమే ఆత్మ। సచ్చిదా నందమేపరబ్రహ్మ। పుట్టినశరీరమల్లా సచ్చిదానందమే। గురుసూచనగానివారికి గురుసూచన గానివారేమూలం। గురుమూలంగావిచారించినవారికి సార్వకాలం అచలమే। కండ్లుమూశినాయెరుకే।కండ్లు తెరిచినాయెరుకే।యీయెరుక లేకుంటే యేమీ లేదు।యెరుకవున్న చోటనేకర్మాలు। యిదివున్నదన్నా పాపమే। లేదన్నా పాపమే। నిర్ణయమనే పాపం। లేకుండా మెదలవలె। నిర్ణయమేపాపం। పరి పూర్ణమనేఅదిన్ని,యిదిన్ని,అని రెండు లేవు।వున్నదివొక్క పరిపూర్ణమే।యీ గుతెరిగే శరీరంయేమీ లేదని నిర్ణయంకాక తన్నుకుంచాడు। యిదియేమీ లేదని రెప్పపాటంతైనా మరువక వుండవలె। వుండకపోయితే। యిది యెంత దొడ్డ ప్రజ్ఞావంతుణ్ణైనా మోసపెడుచుంది। వున్నపరిపూర్ణానికి యిది విరోధి

గనక దీన్ని కూకుడు వేళ్లతో తీశి వెయ్యవలె । యిది యేమీ లేదని సకల క్రియలూ చేశినా అది క్రియాశూన్యం కాదు। యిది లేక పోవుటం గురుమూలంగా తెలిస్తే ప్రసంగాలు నిలిచే। యిదే యిరువై అయిదో తత్త్వం । తక్కినయిరువై నాలుగు తత్త్వాలు యిదే । జ్ఞానరూపం యిదే । కర్మరూపం యిదే । జ్ఞానకర్మరూపమైన శరీరం యిదే । ఆవగింజకూ పర్వతానికి యెంత యెచ్చుతగ్గో। దీనికి అచలానికీ అంత యెచ్చుతగ్గూ । యిది అనిర్వచనియ్యమయింది। అనిర్వచనియ్యమంటె యేమీ లేనిది। దీనికి వున్న సామర్థ్యం దానికి లేదు । యిది యేమీ లేదని దీనికే తెలిస్తే వాదశూన్యం అవుచుంది । యిదే సమస్తమైన వస్తువయం । వస్తువుల యందు వుండే యిది వస్తువులతో పోచుంది । యిది పరిపూర్ణానికి అన్యం కాదు పరిపూర్ణం కాదు। యేమీ లేదు । యిది తప్పవిడిచి అంతా పరిపూర్ణమే । యిదే చిదగ్ని।గనక। యెన్నటికీ నమ్మరాదు।మహానంమ్మించి చూస్తూ వుండంగా యేమీ లేక పొయ్యేది । యిది కలవంటిది। పరిపూర్ణంకోసం యత్నం చేశేది యిదే । యిది చేశే యత్నమే దానికి విఘ్నం । యీ ప్రయత్నం చేశే దాన్ని తీసి వేయుట మే ప్రయత్నం । యీ ప్రయత్నం చేశేవారికి యిచ్ఛ వుండదు । దీన్ని నిల్పేవారికంటే నిలుపుకునేవారికంటే వేరే భ్రాంతికులు లేరూ। యిదే అనేకకోటి బ్రహ్మాండాలు వున్నవని భ్రాంతి పెడుచుంది । తనకు మూలం లేదని యెవ్వరితో చెప్పదు।అందరూ తానే అయి వున్నది । దీనికంటే కౌతుకం లేదు । దీనివల్లనే కర్మాలు పుడుచావి। ఇది సుషుప్తి మరణాలను యెరుగనిది। శరీరమే యెరుక । యెరుకే శరీరం । యీ రెంటిని వేరనేదే వెర్రి। దీనిచాత పుట్టనిచావని దాన్ని । వుండచూచి। దీన్ని । యేమీ లేదని నిశ్చయించుంటేచాలు । యే సాధన వద్దు । యే సాధన చేశినా యిది విడువదు । యరుక అనే నిప్పు కాలుస్తూ వుంచుంది । యెరుకకంటే వేరే నిప్పు లేదు । చిదగ్ని దేహాల సార్వకాలం । చింత్త నిప్పువలె కాలుస్తుంది । సకల శరీరాలూ యెరుకతో కూడానే వచ్చినవి। యెరుకతో కూడా యేమీ లేదు । శరీరంలో కొంత నిబద్ధి కొంత అబద్ధం అనేది అన్యాయం। యీ శరీరం వొక్కటే కాని దీనిలో పలవున్న పేర్లు అనేకాలు । జ్ఞానమని । అజ్ఞానమని। యింద్రియాలని । విషయాలని । గుణాలని । అంతఃకరణ అని ।మనస్సని । బుద్ధి అని । చిత్తమని । అహంకారమని । వేదాలని। శాస్త్రాలని యెన్ని అనివాత్రితా । దీనియందు స్వగత భేదాలు అనంతాలు।తీసి వేశిన

కొద్ది మొటుస్తావి। యిదేవికారస్వరూపం। చెవులువొకతీరుగా వున్నవి। నోటినిండా
బొక్కలు। చుట్టువెంట్రుకలు। లోపట నాలుక। నోరుమాట్లాడుచున్నది। కడుపు
లో వికారాలకు లెఖ్ఖలేదు। తలలో వికారాలుఅనేకం। వికారంలేనిది వొక్క
టైనాలేదు। కాళ్లలో వున్నతిప్పలు చెప్పశఖ్యంకాదు। యిది లేకుంటే యేదివుం
టుందో అదే అచలం। కావలెనని యిచ్ఛవద్దు। కాకపోతినని దుఃఖంవద్దు।
అయితినని అబద్ధాలు ఆడవద్దు। సార్వకాలం గురువాక్యం మరువక వుంటే
చాలు। యీగుర్తెరిగే చైతన్యముగా జగత్తుగా వేరులేదు। శరీరంవలన గుర్తె
రిగే చైతన్యం పుట్టింది। గుర్తెరిగే చైతన్యంవలన శరీరంపుట్టింది। యీశరీరాలు
యీలాగు పుట్టినవంటే। ఆడదానిమీద మొగవాడుయెక్కితే అన్నిపుట్టుచావి।
దేహం లేవనేది దేహమే। యేమీలేదనేది దేహమే। ఉన్నదిఅనేది దేహమే।
యీదేహం లేకుంటేవ్యవహారానకు మూలంయేమని నిర్ణయించాయ। యీ
శరీరం యెవరివలన పుట్టిందో ఆనిర్ణయం మొదలు కల్తలేకుండా విచారించవలె
యీశరీరం లేకుంటే యేమీతోచదు। త్రివిధహంకారం యిదే। చతుర్వింశతి
తత్త్వాలుదేహం। యిరువైఅయిదో తత్త్వమే దేహి। యీదేహిదేహాలే ఈశ్వర
జగత్తులు। లేనిక్షేత్రజ్ఞస్వరూపమే వున్నది వుంచుంది। లేనిదిలేదు అంచుంది।
యీశరీరం లేదు గనక వున్నదానికి వ్యవహారమే లేదు। "అయంజీవాత్ప్యోపాధి
విలయేసతి కేవలోభవతి"। యీక్షేత్రం లేకుంటే క్షేత్రజ్ఞుడు లేనేలేడు। పుట్టుకా
భ్రాంతి సమానమే। గుర్తెరిగేది శరీరంతోటే పోతుంది। గుర్తెరుగుటం వొక్క
టేకాని రెండుగుర్తెరుగుటాలు లేవు। యీగుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే ఆత్మే
బ్రహ్మఅని వేదంపలికింది। యెక్కడ సర్వంతోచిందో అక్కడనే సర్వం లేకపో
వలెను। యీగుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే పరాప్రకృతే అధిష్ఠానం। యీ
గుర్తెరిగే చిత్ప్రకృతి సాక్షిణి। యీసాక్షిణి యిన్ని చిత్రవిచిత్రాలు కల్పి
స్తుంది। యీగుర్తెరిగే సాక్షిణికి మూలం యేమీలేదు। యిది మొగడువిడిచిన
ఆడదిగాదు మొగుణ్ణివిడిచిన ఆడదిగాదు। దేహంవున్నంతశేపే జ్ఞానంవుంటుంది
దేహంలేకుంటేజ్ఞానం లేదు। రోగవికారాలుపోతే రోగంపోయినట్టే। మొరకవికా
రాలు పోతే మొరకపోవును। కలలో శరీరాలవంటివే యీశరీరాలు। యీశరీ

Page changed



నికి మూలం యేమీ లేదు। అన్నివొక్కయేడుపే। సమష్టి దేహత్రయావస్థాత్ర
యాభిమాని త్రయం ఈశ్వరుడు అజ్ఞానం। మహాకారణ శరీరతుర్యావస్థలకు
అభిమాని పరమచైతన్యం। యిదేజ్ఞానం। యిదే కారణం। యిదిఅంతా మాయ।
అహంస్ఫురణే మాయ। యిదే పీత కర్జూర శ్యామ తటిల్లతలు। వ్యష్టి దేహత్రయా
వస్థాత్రయాభిమాని త్రయం। జీవుడు అజ్ఞానం। మహాకారణ శరీరతుర్యావస్థలకు
అభిమాని। ప్రత్యక్చైతన్యం। యిదిఅంతా కార్యం। అవిద్య। అహంస్ఫురణే అవిద్య
యివ్వే రక్త శ్వేత కృష్ణ నీలాలూ। పూర్ణచైతన్యం స్ఫటిక వర్ణం। ఉత్తమ
పురుషుడు। శబ్దాతీతం। ఆకాశాతీతం। జీవుడే క్షరుడు ఈశ్వరుడే అక్షరుడు।
యీయిద్దరూ లేనిదే ఉత్తమపురుషుడు। యిది అంతాగూడ మూలం లేని యీ
గుర్తెరిగే శరీరం। దీనికి సకల వేతృత్వాలు కద్దు। బ్రహ్మవేతృత్వం దీనిదే। యీ
వేతృత్వమనే శుద్ధ తెలివికి పని యేమిఅంటే। బ్రహ్మను వుండజూచి తాను లేక
పోవుటమే పని। దీనికి మూలం లేదు। యిదివచ్చినప్పటినుంచే సకల ప్రసంగాలు।
యిది సమస్త భాషారూపిణి। బ్రహ్మవేత్త బ్రహ్మకాదు। బ్రహ్మకు బ్రహ్మవేతృత్వం
లేదు। యీ వేతృత్వమునే బ్రహ్మమని వాదించేవారి వాదమును తీశివేశేది
శివరామదీక్షితులవారి బోధ। బ్రహ్మవేతృత్వమే బ్రహ్మజ్ఞానం। దీనికి బ్రహ్మవే
తృత్వం ప్రపంచ వేతృత్వం కూడా కద్దు। యిదే మూలమాయ। యిదే ప్రథమస్ఫు
రణ। ఆకాశమందు వాయువు పుట్టినట్టు సుషుప్తికి మెళుకువచ్చినట్టు నేను మేనులు
నెరుగని బ్రహ్మమందు లేని నేను మేనును బుట్టి బ్రహ్మను గని నేనూ మేనులు లేచి
పోవుటమే యీబోధ విన్నందుకు ఫలం। యట్లావున్న ప్రపంచం అట్లావుండగా
వెతికినా క్షేత్రక్షేత్రజ్ఞులు లేక పోవుటమే యీవిచారానకు ఫలం। యీ క్షేత్రక్షే
త్రజ్ఞులలో యేమాత్రం ఆశపడ్డా అదేవిషం। క్షేత్రక్షేత్రజ్ఞులు లేనిదే వృత్త బట్టబ
యలనదగినది। మూలం లేని యీ గుర్తెరిగే శరీరానికి ఊర్ణనాభికి ఉపమానం
చెప్పివున్నది కృష్ణ తత్వోదయమందు। యీ అచలబోధ। సాందీప। శ్రీకృష్ణ।
శ్రీధరస్వామికి। జ్ఞానేశ్వరులకున్ను। శివరామదీక్షితులవారికే యెరుక। శ్రీధర
స్వామి। సాందీప। శ్రీకృష్ణ। శ్రీశుక। శంకరాచార్య। వ్యాస। రామానుజాచార్యుల

గారిమద్వాచార్యగారి।భావార్థము యొక్క।వారివంటివారు వారే।వారిప్రభావం।
శివరామదీక్షితులవారికే యొక్క।యీబోధ యెవ్వరు తెలుసుకున్నారో వారికి
యీనలుగురి ప్రభావం తెలుస్తుంది।జాగ్రత।స్వప్న।సుషుప్తి తుర్యాలు లేనిది।కంటి
లోపాపఅనే గుర్తేరిగే ఆత్మ లేనిది। * * * * *

యీబోధ దత్తాత్రేయులవారి బోధవంటిదీ

ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే

(*) చలలక్షణ ప్రకరణం — సంపూర్ణము. (*)

---

# కాశీ ఖండము.

* సదాచార సంపత్తిలక్షణము. *

గీ॥ అనఘునాకుసదాచారమానతిమ్ము। ధరణిసురుడుసదాచారపరతగాని।
యాత్మసంశుద్ధినడయలేదాత్మశుద్ధి। గానిసిద్ధింపనేరదుగాశికసతీ॥

వ॥ అనినం గుమారస్వామి యతనిం జూచి మన్వత్రి భృగు భరద్వాజ యాజ్ఞవల్క్యశాతాంగీరసాయ మాపస్తంబ సంవర్త కాత్యాయన బృహస్పతి శాతాతప శంఖలిఖిత పదాదుల మార్గంబుల సదాచారంబు ప్రసంగానుప్రసంగంబున వివరించవచ్చిన నపారంబైయుండు గావునం గుంభసంభవ స్ఫుటదిఙ్మాత్రంబు వివరించెద సావధానమతివై యాకర్ణింపుము.

గీ॥ చతురాశ్రమ్యమునం జతుష్కంధమయ్యె। మొదలిస్కంధత్రయము ధర్మమూల
వహింపుము।

వ్రగిమస్కంధమెల్లవింధ్యాద్రిదమన। జ్ఞానసంపద్విభూతికి దానకరంబు॥

శా॥ వారాత్రింగనురెప్ప వేయక మహాయాదోగ్యంబునందీరతా।
దారంధర్యము పూనిమానవుడకుర్వ దాత్పర్యవృత్తిం సదా।
చారం బెట్లొనరింపవచ్చుగలశీసంజాత కాశీశ్వరుం।
గౌరీవల్లభు సంస్మరించి బ్రతుకుంగాక తదప్రచ్యుతిన్॥

గీ॥ ద్విజుడు వేఁబోక మేల్కాంచి దినదినమును । బ్రత్యయపరిహార పరంత జేసినం స్మరిం
పంగదగు సౌష్ఠవమున మాగదాస్వదముక్తి । మంటపంబు వస్తుగుండలంబు॥

వ॥ బ్రాహ్మీముహూర్తంబున మేలుకాంచి కృతాచమనుండై వివిక్తదేశంబున భస్మోద్ధూళనంబును భసితత్రిపుండ్ర ధారణంబొనర్చి రుద్రాక్షమాలికల ధరించి తద్ధ్యాసనాసీనుండై హేరంబ నంబికాసహాయుం ద్ర్యంబకుం లక్ష్మీసహితుం బుండరీకాక్షుం భారతీసహితుం బరమేష్ఠిం యింద్ర శిఖి యమ నైఋతి వరుణ వాయు కుబేర ఈశానుల వసిష్ఠాదిమునుల గంగాది పుణ్యవాహినులం బ్రయాగాది పుణ్యతీర్థంబుల శ్రీశైలాది పుణ్యపర్వతంబుల దుగ్ధోదధ్యాది సముద్రంబుల మానసాది సరోవరంబుల జ్ఞానవాప్యాది దీర్ఘికల నందనాది వనంబుల బుష్కరాదిద్వీపంబుల నార్యావర్తాది విజనంబుల కౌస్తుభాది మణుల నరుంధత్యాదిపతివ్రతల రంభాద్యప్సరసల నైమిశాదిపుణ్యారణ్యంబుల వారణాస్యాది పట్టణంబుల విశ్వేశ్వరాది లింగంబుల పాంచజన్యాదిశంఖంబుల సుదర్శనాది దివ్యాయుధంబుల వేదాదివిద్యల బద్మాది పురాణంబుల విజ్ఞానేశ్వరాది స్మృతులం గాయత్ర్యాది మంత్రంబుల సనకాది యోగీంద్రుల నోంకారాది బీజాక్షరంబుల వ్రీహ్యాది ధాన్యంబుల నారదాది వైష్ణవుల ప్రహ్లాదాది భాగవతుల మాణిభద్రాది ప్రమథుల బద్మాదినిధుల దధీచ్యాది వదాన్యుల హరిశ్చంద్రాది భూపతుల జననీ జనకుల బితరులను మనువులను గురులను సంస్మరించి యీయిందరు నాకు నాయురారోగ్యైశ్వర్యంబులుం బ్రసాదింతురుగాక యనుచు బ్రార్థించి ప్రణమిల్లి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబుల నిష్ఠాపరుండై ద్విజుండొనర్చునది.

సీ॥ వెడలి యూరికి నూరు విండ్లదవ్వున దైత్య । దెస బహిష్కార్యంబు దీర్ప వలయు॥
నన్నూరు విండ్ల మానమగు దూరంబున । బయలికేగుట పాడి పట్టణమున ।
దలము సింగిడి దృణంబుల గప్పినధరిత్రి । విణ్మూత్రజలములు విడువవలయు ।
జెవి బ్రహ్మసూత్రంబు దవిలింపనర్హంబు । పీట ప్రస్రావోత్సర్గవేదియందు।
గీ॥ దివసముఖసంధ్యలందు దఙ్ముఖుడు యామి । నులయందు శమన దిశాననుండు।
నగుచు మౌనవ్రతంబున నవనిసురుడు । మలవిమోచనగావించు గలశజన్మ॥

గీ॥ ద్విజుడు వేకువ మేల్కాంచి దినదినమ్ము । ప్రత్యయాపరిహార పరంత జేసినం స్మరింపంగదగు సౌష్ఠవమున మాగదాస్వాదముక్తి । మంటపంబు వస్తుగుండలంబు॥

వ॥ బ్రాహ్మీముహూర్తంబున మేలుకాంచి కృతాచమనుండై పవిత్రదేశంబున భస్మోద్ధూళనంబును భసితత్రిపుండ్ర ధారణంబొనర్చి రుద్రాక్షమాలికల ధరించి పద్మాసనాసీనుండై పరంబు నంబికాసహాయుం ద్ర్యంబకుం లక్ష్మీసహితుం బుండరీకాక్షుం భారతీసహితుం బరమేష్ఠిం యింద్ర శిఖి యమ నైఋతి వరుణ వాయు కుబేర ఈశానుల వసిష్ఠాదిమునుల గంగాది పుణ్యవాహినులం బ్రయాగాది పుణ్యతీర్థంబుల శ్రీశైలాది పుణ్యపర్వతంబుల దుగ్ధోదధ్యాది సముద్రంబుల మానసాది సరోవరంబుల జ్ఞానవాప్యాది దీర్ఘికల నందనాది వనంబుల పుష్కరాదిద్వీపంబుల నార్యావర్తాది విజనంబుల కౌస్తుభాది మణుల నరుంధత్యాదిపతివ్రతల రంభాద్యప్సరసల నైమిశాదిపుణ్యారణ్యంబుల వారణాస్యాది పట్టణంబుల విశ్వేశ్వరాది లింగంబుల పాంచజన్యాదిశంఖంబుల సుదర్శనాది దివ్యాయుధంబుల వేదాదివిద్యల బద్మాది పురాణంబుల విజ్ఞానేశ్వరాది స్మృతులం గాయత్ర్యాది మంత్రంబుల సనకాది యోగీంద్రుల నోంకారాది బీజాక్షరంబుల వ్రీహ్యాది ధాన్యంబుల నారదాది వైష్ణవుల ప్రహ్లాదాది భాగవతుల మాణిభద్రాది ప్రమథుల బద్మాదినిధుల దధీచ్యాది వదాన్యుల హరిశ్చంద్రాది భూపతుల జననీ జనకుల బితరులను మనువులను గురులను సంస్మరించి యీయిందరు నాకు నాయురారోగ్యైశ్వర్యంబులుం బ్రసాదింతురుగాక యనుచు బ్రార్థించి ప్రణమిల్లి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబుల నిష్ఠాపరుండై ద్విజుండొనర్చునది.

సీ॥ వెడలియూరికినూరు విండ్లదవ్వున నైఋత్య । దెసబహిర్భాగ్యంబుదీర్ప వలయు॥
నన్నూరువిండ్లమానమగుదూరంబున । బయలికేగుట పాడిపట్టణమున ।
దలముసింగిడిద్వృణంబులగప్పినధరిత్రి । విణ్మూత్రజలములు విడువవలయు ।
జెవిబ్రహ్మసూత్రంబుదవిలింపనహర్నంబు । పీటప్రసవోత్సర్గవేదియందు।

గీ॥ దివసముఖసంధ్యలందు దఙ్ముఖుడయ్యామి । నులయందు శమన దిశాసనుండు।
నగుచుమౌనవ్రతంబున నవనిసురుడు । మలవిమోచనగావించు గలశజన్మ॥

సీ॥ నిలుచుండికాంగాదు జలమధ్యమునగాదు । గాదుమున్నిడు నేలగాదుమంచు ।
గాదుగోసన్నిధి కాదగ్ని కెదురింట । గాదగ్రజన్ముల కట్టెదురను ।
గాదుసస్యంబులో గాదురథ్యాభూమి । గాదుగంగాద్యేదురు గాలిగాదు ।
గాటగాగాదునక్షత్ర గ్రహంబుల । గనుగొంచుమలవిమోచనమొనర్ప ।
గీ॥ శిశనమొకచాతగదియించి చెదలుశీమ । లేకశర్కరగాకవల్మీకజంబు ।
నెలుకకలువునగాని మన్నిదుగబట్టి । యరుగునదిశౌచమొనరింప నవనిసురుడా॥
గీ॥ ముసుగుగదియంగ దిగిచి నెమ్మొగమువాంచి । యంగుళియుగ్మమున ముక్కునది
మిఘట్టి।
మలవిమోక్షణమొనరించిత్రోలగునప్పుడు । గడుగదగుగాన మేధ్రంబుగలశజన్మా॥
సీ॥ అయిదువారముల పానాభ్యంతరంబుల । నొకమారుశిశినమస్తకమునందు ।
బదిమారులపసవ్య పాణిపల్లవమున । నిరుగేలులందును నేడుమారు ।
పాంఘ్రిద్వయమునందొకమారుమరలి । గ్రమ్మరహస్తవనరుహములు ।
నంతరాంతరములయందు నిశ్శబ్దంబు । గాబృగృత్యంబు సంశోధనంబు ।
గీ॥ గలుగునట్లుగ నామలకప్రమాణ । మృదులమృత్పిండఖండంబు మేదిమేది ।
గంధలేపక్షయావధిగానొనర్ప । వలయుశౌచంబుదిక్కుకలశజన్మా॥

వ॥ యిది గృహస్థశౌచంబు దీనికి ద్విగుణంబునుం జతుర్గుణంబును బ్రహ్మచారి వానప్రస్థ యతులకు నియతంబైయుండు.

గీ॥ పగటిశౌచంబులోనసాబాలురేయు । రాత్రిశౌచంబులోన నర్ధమురగాతీ
జారచోరాదిదుష్ట కాంతారమార్గ।మునదదర్ధంబుశౌచంబుమునివరేణ్య॥
కం॥ పురుషులశౌచములోనం * దరుణులకర్ధంబుశౌచ * తంత్రంబుమునీ
శ్వరనిష్కారణమింతికి * బురుషునకుందగును * శౌచముంజరుపంగ॥
గీ॥ ధరణిధరమంతపొడవు మృద్రాశియైన । నంబునిధియంతజలమైన ననఘచరిత ।
బాహ్యశౌచంబుబోలదు బాహ్యశౌచ । మనిరిశౌచక్రియావేదులైన మునులు॥
గీ॥ అగ్నిహోత్రాదులకునుజాంద్రాయణాన్న।పిండమునకును శౌచమృత్పిండమునకు।

గలశపిండవయుశరీరకాయయంత । మానసముని చెప్పుదురుగర్గవిధులు॥

వ॥ అనుష్ణంబులు నఫేనంబులు నబుద్బుదంబులు నక్షారంబులు నకలుషంబులు నదుర్గంధ రసంబులునైన యుదకంబులు నగక నిలుచుండక మాటలాడక వెలిసూడక వంగక తినుండక వేగిరపడక యజ్ఞోపవీతంబు విడువక ప్రసారితపాదుండుగాక బహుజానుండుగాక చప్పుడుగాకుండ ముమ్మారు బ్రహ్మతీర్థంబున హృదయపర్యంతంబు డిగ్గశుద్ధి బుద్ధ్యక్షణంబుపాశించునది యనంతరంబ యంగుష్ఠమూలదేశంబుననిలచి దక్షిణవామపాదములయందు నినుపారు గండస్థలంబును నిరియించిన యోష్ఠాధరంబులు ముమ్మారును స్పృశియించి యనంతరంబ కుడిచేతంబుకిలించిన యుదకంబు వామహస్త సంపుటంబుననినిచి దక్షిణవాముపాదంబులయందును మూర్ధ్నంబునందును ప్రోక్షించునది మరియు మాటిమాటికి వామహస్తోదకంబున స్పృశియించుచు నంగుళిత్రయంబున నాస్యంబునుం దక్షిణాంగుష్ఠంబుల నాసికారంధ్రంబులు నంగుష్ఠానామికాగ్రంబులం జక్షుశ్శ్రోత్రంబులుం గనిష్ఠాంగుష్ఠయోగంబున నాభిరంధ్రంబును హస్తతలంబున హృదయంబును నంగుళ్యగ్రంబుల మస్తకోభయ స్కంధంబులు ముట్టువది గొందరనుష్ఠానపరులు యీచతుర్వింశత్యాచమన క్రియలయందు కేశవాది చతుర్వింశతి నామంబులుచ్చరింతురదిగ్రమంబున నంభఃప్రాశన త్రయంబునం గేశవ నారాయణ మాధవ నామంబులం గపోలమార్జన ద్వయంబున గోవింద విష్ణు నామంబులును నుత్తరాధరోష్ఠమార్జనత్రయంబున మధుసూదన త్రివిక్రమ వామన నామంబులు వామహస్తోదక ధారణంబున శ్రీధర నామంబును దక్షిణవామపాదోదక ప్రోక్షణంబున హృషీకేశ పద్మనాభ నామంబులు శిరఃప్రోక్షణంబున దామోదర నామంబును నంగుళిత్రయాస్య సంస్పర్శనంబున సంకర్షణ నామంబులునుం దక్షిణాంగుష్ఠ నాసారంధ్రద్వయ సంస్పర్శనంబున వాసుదేవ ప్రద్యుమ్న నామంబులును ననామికాంగు చక్షుశ్శ్రోత్ర స్పర్శ చతుష్టయంబున ననిరుద్ధ పురుషోత్తమాధోక్షజ నారసింహ నామంబులు నుచ్చరింతురిది యాచమనప్రకారంబు.

గీ॥ శుద్ధుడగుహృద్గతమున భూసురుడునీళ్లు । గలశమునుభూమిపతిదాలుగముల వైశ్యు
డాస్యగములనుశూద్రుండునాంటదియును । నాచమనవేళయందువింధ్యాద్రిదమన॥

గీ॥ ముక్తకేశుండు సంభృతమూత్రగళుడు। గాక సంక్షాళితాంఘ్రియై యాస్యమునుండు
విమలజలములనాచాంతి విధియొనర్పఁ। నహ్నముగువింధ్యశైలదప్పాణపహారి॥

ఉ॥ తుమ్మినయప్పుడుంబురము ద్రోవజరించినయప్పుడు వారిపా।
నమ్మొనరించునప్పుడశనంబుభుజించిన యప్పుడునవ్వ్యప।
స్త్రమ్ముధరించునప్పుడు దురితంబులుచూచినయప్పుడుబుణ్యకా।
ర్యమ్ములయప్పుడు హేయములనంటినయప్పుడు వాయవందగుఁ॥

సీ॥ చిటికెనవేలియంతటి పరిమాణంబు। బడివేళ్లనిడుపునుంబడనుగల్గి।
త్రోల్లిత్రొరలేక త్రోమంగననువైన। తరుకాష్ఠమునదంత ధావనంబు।
వదనసంశుద్ధికై వలయు గావింపంగ। ప్రతిపద్దినంబునుబర్వతిథియు।
షష్ఠియునవమియు సవిత్రువాసరమును। బరిహార్యములుగాష్ఠ భక్షణమున॥

గీ॥ కహ్నదివసంబులేకయనహ్నవేళ్ల। బండ్లదోమంగవలసినం బదియురెండు।
సలిలగండూషములుశేయసంవిశుద్ధి। గలుగువక్త్రంబునకు బ్రహ్మకర్మనిరత॥

గీ॥ దంతధావనపూర్వంబు దానమాడి। ప్రాతరారంభవేళల బ్రాహ్మణుండు।
సంధ్యవార్చంగవలయు నిచ్ఛలునుపస్థ। నర్ఘ్యమీవగునర్కోదయంబునపుడు॥

సీ॥ సౌభాగ్యమేధాప్రసాదసంపన్నహా। త్సాహోదయంబులజన్మభూమి।
నవరంధ్రములయందు స్రవియించుకోలకు। శుచిగానిమేనికి శుద్ధకరము।
తేజంబుగల్పించదీర్ఘాయువొసగింప। జాలువాసరముఖ స్నానమనఘ।
యరుణోదయమునమూర్ధాభిషేకమొనర్చి।తగుజేయమరిమంత్రతంత్రవిధులు

గీ॥ స్నానమునకంగకములుమృత్సంచయంబు।నక్షతంబులుదిలలుదర్భాంకురములు
గోమయంబునుభావమానీముఖంబు।లైనరుబ్బమంత్రములను వింధ్యాదిదమన॥

వ॥ విశుద్ధంబైనమృత్పిండంబు శుచిప్రదేశంబునంబెట్టి యుదఙ్ముఖుండును బద్ధశి
ఖుండునునై యద్దేవతాకరంబులైన మంత్రంబులుచ్చరింపుచు సలిలావ
గాహనంబుసేసి.

కం॥ నేమంబొప్పగబ్రాహ్మణ * యామంబొనరించునదిజ * లాంతరమునలో
పాముల్ద్రాధిపప్రాణా * యామంబుశ్రుతిప్రసూత * యజపంబనఘా॥

గీ॥ మొదలితుద యోంకృతులతోడ సమూర్ధ్నమగుచు। వ్యాహృతుల మూడు
నాల్గిటిసధిగమించి।
మంత్రిరాజంబుగాయత్రిమహిమనొప్పు। గడపుసల్లంగకృతులనుగన్నతల్లీ॥

వ॥ గాయత్రీత్రిపాదజపంబు ప్రాణాయామంబుగాయత్రీ దశవారజపంబు దపంబు జలాంతరంబునం గాయత్రి త్రివారజపంబొండె ప్రణవత్రివారజపంబొండె విష్ణు సంస్మరణంబొండె జేయునది స్నానాంతరంబ కార్ణ్యా పితృప్రీతికరంబు వస్త్రనిష్పీడనంబొనర్చునది యిదిస్నానవిధానంబు.

కం॥ ధౌతపరిధానపరుడై * ప్రాతస్సంధ్యనుభజించి * బ్రాహ్మణుడగుశా
స్త్రోతకరాంగుళియైత్రప * ద్యోతనునకునర్ఘ్యమిచ్చు * నుదయింపంగన్॥

వ॥ అనంతరంబ గాయత్రీజపంబాచరించునది.

గీ॥ పగలునిలుచుండి జపియించునిగమమాత। మాపుగూర్చుండిజపియించుమహి
తభక్తి।
బ్రాహ్మణుడు సంధ్యవార్చనిబ్రాహ్మణుడు। కీసదర్కవశూద్రుండు కేవలంబు॥

వ॥ యీప్రకారంబునమధ్యాహ్నకాలంబునబ్రహ్మ విష్ణు మహేశ్వరుల నింద్రాది దిక్పాలకుల మరీచ్యాది మహర్షుల మన్వాదిమునుల సలిలతర్పణంబులం తృప్తిం బొందించునది చందనాగరు కర్పూర గంధోన్మిశ్రితంబులగు జలంబులు తర్పణార్హంబులు దైవంబారుషంబు బ్రాహ్మ్యంబు పైత్ర్యంబనుతీర్థంబుల దేవాది పితృతర్పణంబు లాచరించునది.

సీ॥ ఛందంబుత్రిష్టుప్చంద్రికాఛవిఛాయ। యభిరామమభినవ యౌవ్వనంబు।
రుద్రుండుదైవత భద్రమాకారంబు। గస్యపుండుమహర్షి గన్నునోసల।
నాపాదమస్తకంబఖిలాంగకంబులు। నధ్వర్యుశాఖాంకుతాత్మకంబు।
లాంబోత్తువాహనం బవతంసకుసుమంబు। దరుణనిర్మలసుధా ధామరేఖ।

గీ॥ తరణిబింబంబు గగనసౌధంబుమీద। బళిడికుంభంబు చందంబు బరిఢవింప।
గానవచ్చినమధ్యాహ్నకాలసంధ్య। యందునచితిరికఖిల విద్యానిధాన॥

గీ॥ పచనపావకు ప్రజ్వలింపంగజేసి। వైశ్వదేవంబొనర్పంగవలయునిష్ట।

జనకకోద్రవమాష నిష్పావకములు। హైలలవణంబులును గావుతద్విధులకు॥

గీ॥ యజ్ఞకార్యంబొనర్చి యనంతరంబ। శాంతకారంబు సిద్ధజేయంగవలయు।
హంతకార మొనర్పబ్రహ్మదులైన। త్రిదశముఖ్యులుతృప్తిబొందుదురుసూవె॥

గీ॥ హంతకారంబనంగ బదారుగుళ్లు। గలశసంభవ నాల్గుపుష్కలమనంగ।
గ్రాసమాత్రంబుభిక్ష యుక్తియ్యమండ్రు। మానిబృందారకతదన్న దానఫలము॥

కం॥ బలిహరణముసేయందగు * గలశసుతా వైశ్వదేవ * కర్మాంతమునన్
నిలయుబహిర్భాగంబున * జలధారాసంయుతముగ * శ్రద్ధాపరతన్॥

సీ॥ కైసేసయంబు వైకైబ్యాంబు నొందక। యుచితపిరేకసంఘ్రులు యుర్వివూపి।
యొండెనిబ్రాఙ్ముఖం బొండెనుదఙ్ముఖం। బగుచుగూర్చుండి నాస్యాభిధార।
మభ్యర్ణముగ విశుద్ధాన్నమాపోశన। పూర్వంబుగా బ్రాణములునపాన।
ములువ్యానాదియగుధాతువులునైదిటికిదృప్తి। యావహిల్లంగ స్వాహాంతములుగ।
గీ॥ బంచవాయునామంబులు బరమనిష్ఠ। వేల్చువిప్రుండుదర్భలు వేళ్లబూని।
యశనకంబదాహుతులు జఠరాగ్నియందు। గుణమునగుణంబు నెన్నక గుడుచు
నప్పుడు॥

గీ॥ కడుపులోగాలికొక పాలుయడమువిడచి। యన్నపానియ్యములతృప్తినావహిల్లి
యవనినిజరుడను పానమాచరించు। దక్రమైనను శీతలోదకమునైన॥

గీ॥ ధరణినిజరుడమృతాభిధానశబ్ద। పూర్వమంత్రంబుసముచితంబుగపఠించి।
సగముబ్రాశించియుదకంబుసగముభూమి।విడువవలయునుహస్తంబుగడిగికొనక॥

వ॥ అప్రక్షాళితదక్షిణహస్తాంగుష్ఠమూల నిష్ఠ్యూతంబైన యాసలిలంబుపుణ్యానిల
యంబైన కారవంబునం రౌరవంబునంబద్మార్బుదనివాసులైన పితరులకు దృప్తి నావ
హించు జేతులకువార్చి యాచమనంబుజేసి శుచియై కర్ణరిసలిలంబు వలి కాలిపెన
వ్రేలిమీద ధారయెత్తునది యద్ధార యయ్యంగుళంబునాశ్రయించిన యంగుష్ఠమాత్రుం
డగు పురుషుంబరితోషింపంజేయు ననంతరంబ బొట్ట నెమరికొనుచుం బ్రాణాపాన

